శ్రీరామచంద్రాయనమః.

# శ్రీమదొంటిమిట్ట

# రఘువీరశతక పీఠిక.

---

ఈగ్రంథమునకు శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక మని పేరు. పద్యంబులందు మకుటంబుగ "నొంటిమిట్ట రఘువీరా జానకీనాయకా" యని యుండుటచే దీనిని జానకీనాయక శతక మని చెప్పవచ్చును గాని మొదటినుండియు దీనికి నొంటిమిట్ట రఘువీర శతకమనియే నామధేయము. స్థలప్రశస్తింబట్టి దాని నిర్దేశింపఁ బూర్వు లిష్టు వాడఁబొచ్చిరి.

నూఱుపద్యములు గల గ్రంథమునకు శతకమని పేరు. అయినను గొన్ని శతకములందు నిన్నూఱుపద్యములును గలవు. ఈశతకంబున నూటయెనిమిది పద్యములు గలవు. అష్టోత్తర శతనామములచేఁ గదా భగవంతు నర్చింతురు. అష్టోత్తర శత గాయత్రిగదా జపింతురు. కావున సంప్రదాయజ్ఞుఁడైన యీ మహా కవిసార్వభౌముఁ డష్టోత్తరశత పద్యహారము శ్రీకోదండరామ స్వాములవారి కర్పించి ధన్యుండయ్యె.

అష్టోత్తర శతసంఖ్యా రహస్యము కొంచెము విచారింతము. వేదమాతయు 'నగాయత్ర్యాః పరోమంత్ర' మ్మని మంత్రంబులందెల్ల నుత్తమమని ప్రసిద్ధిగాంచినది యు గాయత్రీమంత్రము. అది ౨౪ యక్షరములు గలది. గృహస్థులు లోనగువారు ౨౮

అక్షరములే జపింతురు. ౩౨ అక్షరములు సన్న్యాసులు జపింతురు. సంస్కృతంబున బహువచనము మూఁడనది. బహుత్వమున మూఁడు నికృష్టమైనది. మూఁటికి ముమ్మాటికి సని యందుము గదా. కావున గాయత్రిని ౨౪ × ౪=౯౬ గృహస్థాదులు, ౩౨ × ౩=౯౬ మాధ్వ సన్న్యాసులును జపింతురు. ఎటు తిరిగి ౯౬ సిద్ధము. ౯౬ ప్రణవసూచకము. ౯+౬=౧౫ ప్రణవాక్షరము గదా. ఏమంత్రమైనను బురశ్చరణ చేయువారుచ్చారణ ధ్యానాదుల లోపము పూరింపఁగోరి జపించినదాని లో నెనిమిదవవం తెక్కుడగ జపింతురు కావున ౯౬+౧౨=౧౦౮ యయ్యె. మంత్రాదులం దన్నిట నీవిధ యనుస్థేయము. ఆదిశబ్దముచే శ్రీరామకోటియు గ్రహింపనగు. రామశబ్దమే మంత్రము.

## గ్రంథోత్పత్తిస్థలము.

ఈ శతకము కడప మండలమునఁ గడప పురంబునకు నొకటిన్నర యామడ దూరంబుననుండి సంస్కృతమున నేకశిలానగరమనియుఁ, దెనుఁగున నొంటిమిట్ట యనియు వాడంబడు గ్రామంబున జనించెనని ౨-వ పద్యమువలనఁ దెలియనగు. ప్రకృతము తెలిసినంతవఱకుఁ గవీంద్రరత్నాకరమైన యొంటిమిట్టయందు జనించిన గ్రంథములలో నిదియే మొదటిదని చెప్పుటయుఁ దప్పుగాదని తోఁచెడి. కాలకర్మవశతను, జనుల నిర్భాగ్యదశచేతను, దివ్యక్షేత్రములలో నొకటియై యెంతో ప్రశస్తిగన్న యీ క్షేత్రము మబ్బుమాటుననున్న సూర్యునివలె నింత

పఱికు మఱుఁగుపడి మఱవఁబడి యుండెను. ప్రజల భాగ్యోదయమున నది మరల ధూమములేని యగ్నిజ్వాలవలెఁ బ్రకాశింప దొరఁకొనినది. ఈకార్యమున సహాయులగువారే సార్థకజన్ములు. ముక్తికాంతా మనోహరులు. బమ్మెర పోతనామాత్యుఁడిందే శ్రీభాగవతమును దెనిఁగించెను. అయ్యలరాజ వంశజకవు లిక్కడి వారే.

శ్రీకృష్ణలీలామృతంబున నీగ్రామ మిట్లు వర్ణింపఁబడెను.

సీ. జానకీరామలక్ష్మణుల దివ్యమూర్తులవు, నుదిరబంగరుగుట్ట యొంటిమిట్ట
సాధుమందారమౌ సంజీవరాయని, కొప్పైనపెట్టు మాయొంటిమిట్ట
భక్తాగ్రగణ్యులౌ పరమసాధువులుండ, సౌభాగ్యమౌ మెట్టు మాయొంటిమిట్ట
భవ్యచరిత్రులౌ వరకవిచంద్రుల, కనయించుమిట్ట మాయొంటిమిట్ట

గీ. ఉగ్రశీలురకును జెట్టు యొంటిమిట్ట,
యొంటితనమునకును హట్టు యొంటిమిట్ట
యొఱపుఁబున్నెంపుఁబూబుట్టు యొంటిమిట్ట,
యురువుధర్మాళికనకట్టు యొంటిమిట్ట.

చం. అవనిని క్షీరవార్ధియను ఖ్యాతివహించెను బోతరాజభా
గవతసుధాఘటంబునను, గ్రమ్మఱ నయ్యలరాజవంశస
త్కవివరపాళి నిల్వఁగను గల్పధరారుహమున్న సత్ప్రథన్
దవిలినయొంటిమిట్టకును దక్కుపురంబులు సాటియెట్లగున్.

కృతిజన్మకాలము.

ఈకవితంత్రి యయ్యలరా జించుమించు క్రీ. శ. ౧౩౮౩ సందు జనించెను. ఆయన కుమారుఁడైన యీగ్రంథకర్త తిప్ప

రాజు ౧౪౧౩ నందును, నీయన పుత్రుఁడు పర్వతరాజు ౧౪౪౩ నందును, నీయన నందనుం డక్కయామాత్యుఁడు ౧౪౭౩ నందును, రామాభ్యుదయ గ్రంథకర్తయైన రామభద్రుఁడు ౧౫౦౩ నందును జనించి యుండవలయును.

క్రీ. శ. ౧౪౧౩ సం దీకవి జనించెనేని యితని నలువదవ యేఁట నీకృతి రచింపఁబడెనని యూహింపనగు. ఎట్లన మూఁడవ పద్యమునందు

శా. ఆకర్ణాటక మండలాధిపతిచే నాస్థానమధ్యంబులో
నాకావ్యంబులు మెచ్చఁజేసితివి నానారాజులుం జూడఁగా

నని శ్రీ సరస్వతీదేవి స్తుతింపఁబడెను గావున నింతకుముం దనేక కావ్యంబులు చేసి యీయన రాయల యాస్థానకవియై యుండినట్లు తెలియుచున్నది. అంతియగాక ౭౩-వ పద్యంబున

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథా పాపంబు దుర్బుద్ధినై
చాలం జవ్వనమందు గర్వమతినై సంసారినై దుస్త్రియా
జాలభ్రాంతిఁ జరింతుఁ గాని నినుఁ గాంక్షింగొల్వలేనయ్యా

యని చెప్పుటచే నీశతకము యౌవన వార్ధకసంధియం దైనఁ జెప్పి యుండవలెను. కావునఁ గవి తన నలువదవ యేఁట దీని రచించెనని యూహించుట సత్యమునకు విశేషదూరమై యుండదు. కావున నీశతకము రమారమి క్రీ. శ ౧౪౫౩ వ సంవత్సరమున జనించియుండవలెను. ఈయన కావ్యము లన్నియుఁ బేరైన లేక నానాఁడే నశించినను దన కంకిత మీయఁబడిన దగుటచేతను, దొలుత వెలికిఁదీసి ముద్రించినాఁడను పేరు పీసికి

గాసలయు ననుదలంపుచేతను ౪౬౮ సంవత్సరములు దీనిని శ్రీ కోదండరామమూర్తి నష్టము క్రిమిదష్టము గాకుండ రక్షించెను. వాక్ప్రభువులయందును భగవంతుని కీర్తి కరుణాకటాక్షము స్థిరమై నిలుచును గాక. ఈ కాలమును గణించిన విధము పోతరాజ విజయంబున ౩౮-వ పుటయందుఁ గానగు. అంతఁ బ్రమాదవశమున ౨౦ సంవత్సరములు న్యూనముగ వ్రాయఁబడినది. పాఠకులు సవరించుకొందురు గాక.

## కృతిభర్తృవిషయము.

కవి 'యొంటిమిట్ట రఘువీరా' యని సంబోధించుటచేఁ గృతిభర్త యొంటిమిట్టయందు దుష్టశిక్ష శిష్టరక్ష సలుప భక్తులపాలి పారిజాతమై స్వయంవ్యక్తమూర్తియై వెలసిన శ్రీకోదండరామమూర్తి యగుట నిస్సందేహము. కవి రఘువీరుఁడని ప్రయోగించుటచేత నొంటిమిట్ట యందలి స్వామికి రఘువీరుఁడని పేరే కాని కోదండరాముఁడని పేరులేదని యొకానొకరు వాదించిరి గాని యది బాలభాషితము గాన నుపేక్షింపఁ దగినది. దేవాలయమునందలి శాసనములందు రఘునాథ రఘునాయక కోదండరామేతి పదంబులు గానవచ్చెడిని. రఘునాథా యని యీకవియుఁ బ్రయోగించియున్నాఁడు.

కృతిపతి జగత్ప్రసిద్ధుఁడైనను దేశకాలావస్థాభేదములం బట్టి చెప్పవలసిన విషయంబు విస్తారంబుగఁ గలదు. గ్రంథవిస్తరభీతి సంక్షేపింపఁ జేసెద. పితృవాక్యపరిపాలనము నెపముగ శ్రీరామ

చంద్రమూర్తి సీతాలక్ష్మణ సహితుఁడై రాక్షస సంహారముఁ జేసి మునీశ్వరుల రక్షింప దండకాటవియందు నానా ఋష్యాశ్రమ ములందుఁ బది సంవత్సరములు సంచరించెనని శ్రీమద్రామా యణము వచించుచున్నది. ఆసమయంబున మృకండాది మునీ శ్వరుల కాశ్రమమైన యీప్రదేశమందును వారు సంచరించి కొన్నినాళ్లిచ్చట వసించిరి. ఇట్లు శ్రీ సీతారామలక్ష్మణ చరణ కమల పరాగముచేఁ బవిత్రమైన దీప్రదేశము. ఇమ్మూర్తి త్రయము సంచారము సేయునెడ శ్రీ రాముఁడు ముందుగను, నడుమ సీతాదేవియు, నామెవెనుక ధనుర్ధారియై లక్ష్మణుఁడును ప్రణవార్థము బోధించుచుఁ బోవుచుండిరి.

శ్లో. అగ్రతః ప్రయయౌ రామః, సీతామధ్యే సుశోభనా,
పృష్ఠతస్తు ధనుష్పాణి, ర్లక్ష్మణో నుజగామహ॥ దీనికిఁ దెనుఁగు.

తే. అగ్రవర్తియై శ్రీరాముఁ డరుగుచుండె
నువిద తనుమధ్య మధ్యమం దుండెసీత
మహితకోదండదండ సంభరణహస్తుఁ
డోలి వెన్నంటె లక్ష్మణుఁ డొప్పు ప్రేమ.

ఈ పద్యమున మొదటి మూఁడు పాదములందలి మొదటి యక్షరములు గూర్చి చదివిన అ + ఉ + మ యని ప్రణవ మేర్పడు చున్నది. పద్యార్థము ప్రణవార్థమును బోధించుచున్నది. మాయా మానుషమూర్తియైన శ్రీరామచంద్రుఁడు మార్గదర్శియై తన యాచరణము చేత లోకులకు శిష్టాచార తత్త్వములు బో

ధించెను గాని గీతాచార్యునివలె వాగ్రూపముగ నుపన్యసిం
చిన వాఁడుగాఁడు. ఈవిషయము శ్రీకృష్ణ లీలామృతంబునఁ
గననగు. తత్త్వవేదులయిన మునీశ్వరు లీతత్త్వము గ్రహించి
కృతార్థులైరి. శ్రీరామనామ మహత్త్వ రహస్యము ముద్రింపఁ
బడుచున్న శ్రీరామనామ మాహాత్మ్యంబుచే నెఱుఁగనగు.
అట్లు కొన్నిదినము లందు వసించి తన బాణప్రయోగంబునఁ
బాతాళగంగను భూమికిఁ దెప్పించి శ్రీరాముఁ డిచ్చటి మునీ
శ్వరుల కానందదాయి యయ్యె. అదిమొద లాదివ్యతీర్థము
శ్రీరామతీర్థమని ప్రసిద్ధి గాంచెను.

నిరంతర రామనామ జపముచే విరక్తి యుదయింప శివుఁడు
భార్యను బుత్రులను సర్వమును ద్యజించి యేకాంగియై లింగమై
యిచ్చట శ్రీరామసేవ సేయుచున్నవాఁడు. కావుననే యీ
యొంటి లింగమునకు నొంటిమిట్టరామలింగ మని ఖ్యాతి
కలిగెను. ఈలింగ మిప్పుడు కట్టమీఁది వీరాంజనేయుల కోవెల
యందు నెలకొల్పఁబడి యున్నది.

శ్రీసీతారామలక్ష్మణులీప్రదేశము విడిచి యితరాశ్రమము
లకుఁ బోవ సమకట్టఁ దద్వియోగ తాపంబున కోపక తద్దర్శన
సేవాదుల మాని యుండఁజాలక యందలి మునీశ్వరులెల్లఁ
బోవలదని శరణాగతులు కాఁగా భక్తవాంఛాపూర్తియే దీక్షగాఁ
గొన్న కరుణాసముద్రుఁడగు రామభద్రుఁ డాత్యంతిక కార్య
విధముఁ దెలిపి ప్రణవార్థంబు బోధపడఁ దమ ప్రతిరూపంబు
లచ్చటకై యొసంగి చనియె. ఏకాక్షరంబున నక్షరత్రయంబుఁ

బోలె నేక శిలయందు మూఁడు విగ్రహములు జనించి జ్ఞానము గల భక్తులకుఁ దత్త్వసూచకమై యున్నవి. ఇప్పుడు గ్రామము కూఁడఁ బ్రణవాకారమును వహించియున్నది.

కోదండధరుండైన శ్రీరాముఁడు నృసింహమూర్తికంటెను నుగ్రతరమూర్తి యని యుపాసకుల తలంపు. శర కోదండధారణము ద్వివిధము. కొన్నిమూర్తుల కుడికేల బాణాగ్రము నేలఁ జూచుచుండును. ఎడమచేయి ధనుష్కోటిని బట్టి యుండును. కొన్నిమూర్తులయందు బాణాగ్రము మిన్నుచూచుచుండును. వామపాణి లస్తకంబున నుండును. ఈవిధము సద్యశ్శరప్రయోగ సన్నాహమును సూచించును గావున మొదటి యాకారమునకంటె రెండవది రౌద్రమందురు. ఈవిధముగ శరచాపములు పట్టుటఁ జూచియే ప్రేమస్వరూప యగు శ్రీసీత లోకమాత శ్రీరామునకు నహింసా విషయము బోధించెను. ఈదేశమును రావణాసురుఁడు శూర్పణఖకుఁ బసుపుకుంకుమములకై యిచ్చెనని యందురు. ఇది సత్యమైనను గాకున్నను రాక్షసాంశ జనితులు నేఁటికి నీప్రాంతములఁ గలరు గావున నీదేశము పూర్వము రాక్షస ప్రచురప్రదేశ మనుటయందు సందియము లేదు. ఇట్టి చోట నుద్యతాయుధులై రామలక్ష్మణులు చరించి యుండుట వింతగాదు. కావున నొంటిమిట్టయం దిట్టిమూర్తులే కానవచ్చుచున్నవారు.

నృసింహు రౌద్రమును బ్రహ్లాదునివలె నిట్టి యుగ్రమూర్తి యగు శ్రీరామమూర్తి రౌద్రమును నేకపాద రుద్రుఁడగు నాంజ

# పీఠిక.

నేయుఁడు దక్క దక్కినవా రెవ్వరు సహింపఁగలరు? కావునఁ బ్రక్కల నెదుటను భక్తాంజనేయులు సంజీవరాయాఖ్య వహించి నిలిచి యున్నవారు. శ్రీ కోదండరామ రౌద్రాగ్నిని గొంతవఱకుఁ జల్లార్పఁ బ్రసన్నాంజనేయులు పాల్పడియుండుట చేతఁ బూర్వము నగరముగా నుండిన యీప్రదేశ మిప్పుడు కుగ్రామమై నామావశిష్టకల్పమై యైన నున్నదిగాని లేని యెడల నీ దేవతాపరిచారకులు కుమతిధారులు గావించు చుండకయుండిన యెడల నీగ్రామము నామావశిష్టమై యుండ వలయును. నీచులు కలహింతురు సాధువులు సంధిగోరుదురను న్యాయముగాని పోరు నష్టి పొందు లాభమను నీతిగాని పాటింపక పూర్వ మీదేవాలయ ధర్మాధికారులు పరస్పరము కలహించి స్వామి కశనాభావము గల్పించి యాదరింపక యాదరింపఁ బూనుకొను వారిని దమ కలహములచే నిరుత్సాహపఱుచుచుండినవారు. "అమ్మ తాను బెట్ట దడుగుకొని తిననీయ" దనుసామెత గలదుకదా. ఇట్టి పుణ్యజనులు హతశేషులు నేఁటికి నిరువురు మువ్వురు గలరు. వారికి సాధుబుద్ధి నొసఁగి కాండకాండాసనమండితుఁడైన రఘువీరుండు చక్కఁబఱచుఁగాక.

అత్యున్నతదశయందుండిన యీ మహాదేవాలయమున కిట్టి దుర్దశ యెట్లు లభించెనని కొందఱు సందేహింపవచ్చును. ౨౮-౧౧-౨౧ తేదియందు శ్రీకోదండరామస్వాములవారి దేవాలయమందు దేవస్థానపుఁ (గమిటిదార్లు) నల్వురు సభగూడిరి. తత్పూర్వము ౧౯-౯-౨౧ తేదియందు

నలువురు కమిటిదార్లు నల్వురు రెడ్ల ధర్మకర్తల నేర్పాటుచేసిరి. దేవపూజాపాకాదులందు లోపములఁ గనిపెట్ట నొక బ్రాహ్మణుని శైవిచారణ కొక బ్రాహ్మణేతరుని నేర్పఱిచినఁ జాలరా యిందఱేలయని ప్రశ్నించితిని. రెడ్లమర్యాదలు కాపాడుకొనుటకైయని ప్రత్యుత్తర మొసఁగఁబడెను. కంటిరెగదా లోకులారా! దేవాలయము వీరికై పుట్టెనో వీరు దేవాలయమునకై యేర్పడిరో యాలోచించు బుద్ధి బలము వీరికి లేదాయెఁగదా. అంతియగాదు. రెండు వింతవార్తల నీ సభయందు వింటిని. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులని వర్ణక్రమము వేదశాస్త్రచోదితమైయుండ వైశ్యులకుముందు మీకెట్లు మర్యాద గలిగెనని యొక రెడ్డిగారి నడిగితిని. మేము రెడ్లము. క్షత్రియజాతివారమని ప్రత్యుత్తర మొసంగఁబడియె. ఏ గ్రంథమందును నే నిదివఱకు దీనిని జదివినవాఁడనుగాను గావున నచ్చెరువుగొని తఱచిచూతమని నీవు క్షత్రియబీజమునకుఁ బుట్టితివాయని ప్రశ్నించితిని. అవునని యా పెద్దమనుష్యుఁడు జంకు గొంకు కళంకు లేక నిశ్శంకముగ శంఖఘోషముతో నిండుసభలో నూర్వురు విన వచించెను. అంతతో నుండిన మేలే. వైశ్యులు మాతంగజాతులనికూడఁ జెప్పెను. ఈ రెండువిషయము లితరులు వచించినఁ దర్కించియుండుదునుగాని వీనిని వచించినవారు నేను రాజంపేఁట తాలూకాలో రివిన్యూ ఇన్స్పెక్టరుగా నుండినకాలములో నాకుఁ బరిచితులును బ్రాజ్ఞులును, జదువరులును, నుదారులై సర్వము తహశీల్దార్ల కొసఁగి మాఱట

తహశీల్దార్లని కీర్తిగన్న గుంటూరు వాస్తవ్యులు మహారాజశ్రీ ఆవుల బాలయ్యగారి కృష్ణారెడ్డిగారగుటచేత నిందు సత్యము గలదేమోయని జంకితిని. నా సందేహము తీర్చుకొనఁ జరిత్రకారులీరెండువిషయములఁ దర్కించి యిదమిత్థమ్మని సిద్ధాంతము చేయుదురుగాక యని యిందు వెల్లడించితి. ఇంకనైనను స్వామికార్యమునఁ దదేకదృష్టినిడి పరస్పర కలహములు మాని స్వప్రతిష్ఠ లాశింపక వంచనమాని కైంకర్యరతులై యిహమునఁ గీర్తిసంపదలను, బరమున మోక్షలక్ష్మిని నీగ్రామజనులు నధికారులందఱుఁ బొంద భగవంతుఁడు వీరికి సాధుబుద్ధి నొసంగును గాక. పూర్వచరిత్రలవలన గలిగిన నష్టిని నపకీర్తిని బాపము నెఱింగి యిప్పటివారు బుద్ధిమంతులై నీచ కలహముల నాసక్తి మాని శాశ్వతకీర్తి ముక్తుల సంపాదించెదరో లేక శాశ్వతాపకీర్తి నరకముల పాలయ్యెదరో ముందుముందు లోకమెఱుంగఁగలదు. ఇప్పటికి వీరిచర్యలందు శుభోదర్కసూచన లే కానవచ్చుచున్నవని సంతోషించుచున్నవాఁడను. కొందఱు కుమతిధారులు తప్పఁ బూర్ణమనస్సుతో నందఱు స్వామికైంకర్యమొనర్చుచున్నవారు. తిరుపతి వేంకటాచలపతి ఘటికాచల నృసింహమూర్తివలె జాగ్రదర్చామూర్తులని యెన్నిక గన్నవారిలో నొంటిమిట్ట శ్రీకోదండరామమూర్తి యొకఁడనుటకు భక్తుల స్వప్నంబులఁ దోఁచుటయు, మ్రొక్కువారల కోరికలు సఫలముగఁ జేయుటయు నిజస్వచోరుల నిర్మూలించుటయు లోనగునవి ప్రత్యక్ష నిదర్శనములు. భద్రాచల రామమూర్తి

గోపన్న విషయమున జరపిన యద్భుత కార్యమునకంటె నత్యద్భుతమహిమలు భక్తుల విషయంబున నొంటిమిట్ట శ్రీకోదండరామస్వాములవారు కనఁబఱచి యున్నవారు. అవి యొంటిమిట్ట కోదండరామభక్త చరిత్రమందు వివరింపఁబడును. ఏనాఁటి మాటయో యేల? నేఁడు పునరుద్ధారణ కార్యనిర్వహణమందుఁ గనఁబఱుచు నద్భుతలీల లాశ్చర్య జనకములై యున్నవి.

మతిమంతులు భక్తులపాలి కొంగు బంగారమైన యీ శ్రీరామమూర్తిని దర్శించి సేవించి భజించి యర్చించి యుపాసించి ధన్యు లగుదురు గాక.

కృతికర్తృ విషయము.

ఈ రఘువీరశతకకర్త యెవరైనది గ్రంథమువలనఁ దెలియరాదు. అష్టోత్తరశతనియతికి భంగమువచ్చునని ౧౦౯-వ పద్యముగఁ దనపేరు వ్రాయనే లేదో కవి వ్రాసియుండిన ఖిలమై పోయెనో తెలియదు. ౨-వ పద్యములోఁ "బద్యముల్ నూఱుం జెప్పెద నూరుఁబేరు వెలయన్" అను దానికిఁ గృతిపతి యూరుఁ బేరనియే యర్థము గ్రహింపవలసియున్నది. అయినను నీ గ్రంథమున నొంటిమిట్ట రఘువీరాయని యుండుట చేతను, రామాభ్యుదయ గ్రంథకర్తయై యీ కవికి మునిమనుమఁడగు నయ్యలరాజు రామభద్రకవి "శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణకర్తృత జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజుతిప్పమనీషి పర్వతాభిధానపౌత్ర" యని వ్రాసియుండుటచేతను, నీవంశమందే జనించిన రెట్టమత గ్రంథకర్త "రఘువీరశతక నిర్మాణకర్తృత

రాయకవి తిప్పనార్య" యని వచించుటచేతను నీ శతకమును రచించిన కవి యయ్యలరాజు తిప్పరాజని యేర్పడుచున్నది. కవి యింటిపే రయ్యలరాజువారు. కావున నీ కవి తిప్పరాజును నార్వేల నియోగిబ్రాహ్మణుఁడని యేర్పడుచున్నది.

అంతియగాక ౬౭-వ పద్యంబునఁ "దిరునామంబు ధరింపఁ డేని నొసలన్" అని వ్రాయుటచే నీ కవి తిరుమణి శ్రీచూర్ణములు ధరించు నూర్ధ్వపుండ్రధారియని యేర్పడుచున్నది. కవి ౪౬-వ పద్యంబున "నీ పేరునుం బెట్టితిం నీ పెన్ముద్రలుఁదాల్చితిం భుజములన్" అనుటచేఁ బంచసంస్కారవిశిష్టుఁడైన విశిష్టాద్వైతియనుట స్పష్టము. ఈ పద్యమునందే "నీ పాదోదకములం దదిమికొంటిం, గొంటి నాలోనికిన్, నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్" అనుటచే నీవలివారి విచారణలోపముచేఁ దీర్థప్రసాదస్వీకరణమీ కోవెలయందు నిలిచిపోయెఁగాని పూర్వమాళ్వారుల ప్రతిష్ఠయుఁ దీర్థప్రసాదస్వీకారమున్నట్టు వెల్లడి యగుచున్నది ఆళ్వారుల విగ్రహములు భిన్నములై యందందుఁ గోవెలలోఁ గానవచ్చెడి. వాస్తవమిట్లుండ నీ దేవాలయము 300 సంవత్సరములనాఁటి కీవలిదని వాదించువా రెంత విజ్ఞులోకదా.

౫౨-వ పద్యములో "ఏకాదశింగూడుటిన్నామూఢాత్ముఁ" డనుటచే వ్రతనైష్ఠికుఁడని యేర్పడుచున్నది. ౧౪-వ పద్యమున నీకవి

మ. పటునిర్ఘాతకఠోరనాదము ఘనబ్రహ్మాండభాండంబుఁ బి
క్కటిలం జేయుచు వచ్చునప్పు డితరుల్ గాండీవినామంబులె

న్నట మేలంగురు, వైష్ణవుల్ దలఁప రమ్యం గోరి యెంతెంత దు
ర్ఘటముల్ వచ్చిన నిన్నెగాక రఘువీరా జానకీనాయకా.

యనుటచే నీయన వీరవైష్ణవుఁడని యేర్పడుచున్నది.

ఆఱువేలనియోగులు వైష్ణవప్రపత్తిగలవారు సాధారణముగ గోలకొండవ్యాపారులుగా నుందురుగావున నీయనయు గోలకొండవేపారియో యని సందేహింపఁదగియున్నది.

౨౩—౭౯-వ పద్యములం జదివిన నీయన కేవలభక్తిమార్గనిష్ఠుఁడని చెప్పవలసియున్నది.

ఈయనవీరవైష్ణవప్రపత్తి మఱియొకవిధముగఁ గూడఁ దెలియనగు.

ఈయనకుఁ దల్లిదండ్రులు పెట్టినపేరు తిప్పరాజు. తిప్ప శబ్దము త్రిపురాంతక శబ్దభవము. ఇది శైవనామమగుచున్నది. వైష్ణవభక్తిపూర్ణుఁడైన యీకవి యీపేరు తనకు సరిగాదని రామరాజనియో మఱియేదో రామనామమును దాసుంచుకొన్నవాఁడని “నీపేరును బెట్టితిగా (౪౬-వ ప) నాపేరు పెట్టినవానిగా” (౩౫-వ ప.) అను ప్రయోగములు దెలుపుచున్నవి. ఆత్మనేపద మనిత్యముగావున “పెట్టుకొంటిగా” అనుటకు మాఱు పెట్టితిగా అని పరస్మైపదము ప్రయోగించెను. పట్టము గట్టుకొని యేలుమనుటకుఁ “బట్టముగట్టి యేలుము మముగా” అని నన్నయభట్టారకుఁడును బ్రయోగించెఁగదా. ౪౬-వ పద్యమునఁ గ్రమమును జూచిన నిది యాత్మనేపదార్థమునఁ బ్రయోగింపఁబడెనని స్పష్టమగును. అటుగాదేని తన కుమారున కా

పేరు పెట్టెనని యూహింపవలసివచ్చును. అది నిరాకరము. 'శైవశాస్త్రమతము' గనిన వాని తనూభవుఁడయ్యు బమ్మెరపోతరాజు వైష్ణవభక్తియుక్తుఁడయ్యెంగదా. ఒంటిమిట్ట కోదండరామ మాహాత్మ్యముం గని శివునంతటి మహానుభావుఁడు సర్వసంగత్యాగియై రామలింగమని రామనామాంకితుఁడైయుండ మనుష్యులు తద్భక్తులై తన్నామాంకితు లగుట యేమిచిత్రము.

౭౨-వ పద్యములోని యైతిహ్యము పద్మోత్తరపురాణంబునఁ గలదుగాని ౧౬-వ పద్యంబులోని యైతిహ్యమెందలిదో నాకుఁ దెలియదు. తెలిసినవారు తెలిపి నావందనములందుకొనవేఁడెద.

౧౩-వ పద్యమునఁ గర్ణాటాధీశ్వర యొంటిమిట్ట రఘువీరా యని స్వామిని సంబోధించుటచేఁ గడపమండలముగూడఁ గర్ణాటకమని పేరొంది యుండినట్లు తెలియనగు. శుద్ధాంధ్రుఁడైన శ్రీనాథుఁడు 'నా కవిత్వంబు నిజము కర్ణాటభాష' యనుటచేతను, శుద్ధాంధ్రదేశమైన కడపమండలము కర్ణాటముగా నీకవి చెప్పుటచేతను గర్ణాటాంధ్రశబ్దములు పర్యాయములను వారి వాదమే సత్యమేమో.

## కవిస్థితిగతులు.

కవిరత్నాకరమైన యొంటిమిట్ట యీకవిస్వస్థలమని మీఁద వచించితిని. కవిరత్నములకు రత్నములకు నిజజన్మస్థలంబులు విలువలేదు. కేవల విరక్తుఁడైన బమ్మెరపోతననంటి సత్కవీశ్వరులు తప్పఁదక్కినవా రుదరపోషణార్థము గ్రామాంతర దేశాం

౧ తరవాసులు కాకతప్పదు పూర్వము విద్యావంతులను రాజులు సన్మానించుచుండిరిగావున నట్టి యుదారశీలురైన ప్రభువు లుండుచోటికిఁ బండిన చెట్టునకై పక్షులవలెఁ గవులు పోవు
౨ చుండిరి. అట్టులె యీకవియు నిజదేశాధీశ్వరుఁడైన రాజు నొద్దకుఁబోయి యాయనయొద్ద నాస్థానకవియై రాయకవి యని
౩ పేరుపొంది యచటఁ దత్పుతులకుఁ బ్రీతిగఁ గృతులర్పించి పొట్ట
౪ పోసికొనుచుండెను. ఈయన కాలపు రాయలు (విద్యానగర సంస్థానాధిపతి) ౧౪౪౩ సం॥ మొదలు ౧౪౪౭ సం॥ వఱకుండిన ప్రౌఢదేవరాయలై యుండవలయు. ఈయనకు వెనుకను నీకవి జీవించియుండవచ్చును. ఈ రాయల మరణానంతర మీకవి కచ్చటఁ దగిన సన్మానము లభింపమిఁ గాఁబోలు మరల స్వగ్రామమైన యొంటిమిట్ట కరుదెంచి యీ శతకము రచించెను.

శా. అకర్ణాటక మండలాధిపతిచే నాస్థానమధ్యంబులో
నాకావ్యంబులు మెచ్చఁజేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యము లిచ్చుచో నిపుడు వాణీదేవి నాజిహ్వపైన్
రాకుం డెట్లు? వసించుఁగాక రఘువీరా జానకీనాయకా.

3-వ పద్యమును జూచునది.

రాయల యాస్థానకవియని పేర్పొందిన యీకవి తుదకు

మ. అడుగున్విద్యకు లోనుచేసితివి నన్నావంత నావంతలే
కడియాసంగొనుచున్ దురాత్మకుల నే నర్థించుచున్నాఁడ

ననియు,

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పిన కృతుల్ ఛీ ఛీ నిరర్థంబులౌ
నుతి పాత్రమ్ములుగావు మేఁకమెడ చన్నుల్ నేతిబీరాకులౌ

*        *        *        *        *

మ. తమ గర్వంబునఁ దాగు పొంగిపడుచున్ దైవంబు మంత్రంబు తం
త్రములన్ వీడఁగ నాడుచున్ దిరుగు నిర్భాగ్యుల్ మహారాజులై
మము నూరింపఁగ నేము నిన్నెఱిఁగి నీ మంత్రం బెఱింగిన్ దరి
ద్రమతిన్ వేఁడఁగఁ బోవుటెట్లు రఘువీరా జానకీనాయకా. ౪౯

మ. పిసినింజూచి మహాప్రదాత యనుచున్ బీభత్సకుత్సాంగునిన్
బ్రసవాస్త్రప్రతిమానరూపుఁడనుచున్ బందం బ్రియంబంద శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబుఁ గావించు నీ
రసుఁడన్ నిన్ను నుతింపనేర రఘువీరా జానకీనాయకా.

అని నిర్వేదింపఁ గారణ మేమి కల్గెనో.

ఈపద్యములు ప్రౌఢదేవరాయలనో తదనంతర ప్రభువునో యుద్దేశించి వ్రాయఁబడినవనుట నిస్సందేహము. సంస్థానాధిపతులయొద్దకుఁ బోయిన యీ కవులగతులు శోకాలాపములు గాంచికాంచి కాఁబోలు బమ్మెరపోతన

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్నిపుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఉ. కాటుకకంటినీరుచను గట్టులపైఁబడ నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి నిను నాఁకట గ్రాసము కోసరంబు క
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ.

ఉ. బాలరసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి? గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై.

యిట్లు వచించెను. నిష్కారణముగఁ బ్రభువుల దూషించె ననుటకంటెఁ బోతన్న పూర్వకవులు రాజుల నాశ్రయించి పడెడిపాట్లు కన్నారఁగాంచి యాచన రోసి యట్లు చెప్పెననుట యుక్తియుక్తముగదా. మహిషశతకోత్పత్తికిట్టిదేకదా కారణము. అట్లైనచో నీగ్రంథము భాగవతమునకంటెఁ గించిత్పూర్వమే రచియింపఁబడి యుండవలయును.

ఈయభిప్రాయమును దృఢపఱుచు

మ. వరనారీకుచకుంభపాలికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపైఁ గంఠంబుపైఁ గొప్పుపై
పరువుల్ పాఱెడు నాతలంపులు . . . . ౯౯ ప.

ఈపద్యమును భాగవతములోని

ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై . . ౮ స్కంధ. భాగ

యీ పద్యముతోఁ బోల్చిచూచినపుడు మంచిపద్యము దుష్కామపరముగ వినియోగింపఁబడియుండుటకు వగచి భగవత్పరముగఁ బోతన వ్రాసెనని తోఁచెడి. భవభూతిమాలతీమాధవంబున "లీనేవ ప్రతిబింబితేవ" యను శ్లోకరత్నము భగవత్పరము గాకపోయెనని వగచినవారు గలరుగదా.

## కవితావిషయము.

కవితావిషయ మించుక వచించి యిప్పటికే దీర్ఘతరమైన యీ పీఠికను ముగించెదను. ఈశతకము సర్వజనహృదయంగమమైన మనోహరశైలి వ్రాయఁబడినది. కుదుటఁబడిన ముదురు కవిత్వముగావున సమభూమిని బాఱు గంగాప్రవాహమువలె నేకవిధమైన శైలిగలదై యుడుదుడుకులులేక సర్వజనశ్లాఘాపాత్రమై యున్నది. ఈయనయు శబ్దాలంకారప్రియుఁడనుటకు ఛందశ్శాస్త్రమర్మజ్ఞుఁడనుటకు ననేకప్రయోగములు గలవు. అయినను ఉదయింపఁగ అనుటకు ఉదయించఁగ అనియు రమఁఱులన్నశ్వత్థనారాయణయని ద్రుతప్రకృతిసంధియుఁ బ్రయోగించెను. మొదటిదోష మీయనయందేగాక యీయన సమకాలికులగు నితరకవులు కొందఱియందును గలదు. పక్షవాద మందురేమో. రెండవప్రయోగమునకు 'అన్నిష్టసఖనూఁదియున్నదాని', 'ఎన్నఁడున్నేని' అను భారతప్రయోగములే శరణము. బమ్మెరపోతనయు నిట్టి సంధి కూర్చెను. ఈయన రేఫఱకారములకు యతిప్రాసములమైత్రిఁ గూర్చెను. అందును మతభేదము గలదుగదా. ఇట్టివి కొందఱు దోషములనినఁ గొందఱు సాధువులందురు. ఇట్టివిగాక లక్షణదోషము లిందెందును గానరావు. కవిత్రయమువారు ప్రయోగించినదగుటచే నఖండయతి యీకవియుఁ బ్రయోగించెను. కౌసల్యాపరిణయ టీకయు ఛందోదర్పణముఁ గనుఁడు.

ఈగ్రంథము వ్రాఁతప్రతి దోషభూయిష్ఠమై యున్నది. అవి లేఖకుల యజ్ఞానకృతములు ప్రమాదపతితములై యున్నవి. కవిహృదయమని తోఁచినవి నామతమునఁ దప్పైనను నట్లే యుంచి తక్కినవానిని సవరించితిని.

మ. మును నాకెన్నఁడు దోషముల్ గలవు నొప్పిం బొందకే
మని కొలుబంటులిఁక నన్నాపేరు నాపేరు పె
ట్టిన వానికిఁ బరలోకదూరుఁడని వప్పెదెట్లు పొండంచు

అను పద్య మిట్లే కవివ్రాసెనని యేమతిమంతుఁ డనును?

ఇంకను దోషము లింకెం దేని గాననగు. విజ్ఞులు క్షమింతురుగాక.

వ్రాఁతప్రతి సిద్ధముచేయించి చిత్తుప్రతియు సవరించి యిచ్చిన నామిత్రులు బ్ర॥శ్రీ॥రా॥శ్రీ॥ క్రొత్తపల్లి సూర్యారావు పంతులుగారికిఁ గృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచు న్నాఁడను.

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట.
౧౫-౧౨-౧౯౨౧.

వావిలికొలను సుబ్బాఁరావు.




# శ్రీమదొంటిమిట్ట
# రఘువీరశతకము.






కల్యాణగుణాభిరామ! విబుధశ్రేణీకిరీటద్యుతి
వ్యాకీర్ణాంఘ్రిసరోరుహద్వయ!సహస్రాక్షస్తుతా!యచ్యుతా!
నాకుం బ్రాపును దాపు నీవె యగుచున్ నన్నేలుమీ రామభ
ద్రా! కారుణ్యసముద్ర! ధీర! రఘువీరా! జానకీనాయకా!

శా. తారుణ్యోదయ! యొంటిమిట్టరఘునాథా! నీకు నేఁ బద్యముల్
నూఱుం జెప్పెద నూరుఁబేరు వెలయన్ నూత్నంబుగా; నంత నా
నోరుం బావన మౌను, నీకరుణఁ గాంతున్, భక్తి నన్నందఱున్
రారమ్మంచును గారవించి రఘువీరా! జానకీనాయకా! ౧

శా. ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబులో
నాకావ్యంబులు మెచ్చఁ జేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యము లిచ్చుచో నిపుడు వాణీదేవి నా జిహ్వకున్
రాకుం డెట్లు? వసించుఁగాక రఘువీరా! జానకీనాయకా! 3

శా. నీకేలం దృణ మంటి వైవ నదియుక్ నిర్ఘాతపాతక్రియక్
గాకాకారనికారదానవుని లోకాలోకపర్యంత మీ
లోకంబుల్ పదునాల్గు త్రిప్పి నది కాలు న్సోఁపఁగా నేర దా
రా కాకుత్స్థకులాగ్రగణ్య! రఘువీరా! జానకీనాయకా! ౪

మ. సకలామ్నాయములం బఠించుఫల మజ్ఞాతాత్ము నామంబులం
దొక టేదైనఁ బఠింపఁ గల్గు నటువం టుత్కృష్ట పుణ్యప్రవ
ర్తకనామంబులు చక్రపాణికి సహస్రంబుండుఁ దత్తుల్య మ
ర్కకులా! నీ శుభనామ మార రఘువీరా! జానకీనాయకా! ౫

శా. కొంకం గారణ మేమి ధర్మములు పెక్కుల్ చేసి మర్త్యుండు నీ
వంకం జిత్తము నిల్పలేక పెరత్రోవల్ త్రొక్కినక్ సర్వముం
బొంకై పోవుఁ; గురంగనేత్ర దగునోముల్ వేయునుక్ నోచి తా
అంకాడంగఁ దొడంగినట్లు రఘువీరా! జానకీనాయకా! ౬

శా. ఆగౌరీశ్వరకీర్తనీయుఁ డగుని న్నర్చింపఁగా లేనివా
రోగు ల్గారొకో చాల యోగ్యులయినక్ యోగానుసంధాను లీ
మాగుల్కాన యథార్థమాడిలిని నీమంత్రంబె మంత్రంబురా!
రాగద్వేషవిదూర! ధీర! రఘువీరా! జానకీనాయకా! ౭

మ. జగముల్ మూఁడు సృజింపఁ బ్రోవఁ బిదపక్ సంహారముం జేయఁగాఁ
త్రిగుణాకారముఁ దాల్చినట్టి వరమూర్తీ! వాసుదేవా! హరీ
నిగమస్తుత్యపవిత్రగాత్ర! నృహరీ! నీలాభ్రవర్ణా! మహో
రగతల్పా! జనకల్పభూజ! రఘువీరా! జానకీనాయకా! ౮

శా. నీచారిత్రముఁ జెప్ప నద్భుతమగుక్, నీనామసంకీర్తనం
బాచండాలునకైన మోక్షమొసఁగుక్, హత్యాదిదోషంబులక్
వే చించుక్ విదళించుఁ ద్రుంచుఁ దునుముక్ వెంటాడు నంటంబడుక్
రాచుం ద్రోచు నడంచు నొంచు రఘువీరా! జానకీనాయకా! ౯

శా. తేజం బొప్పఁగ నీవె కావె మొదలం ద్రేతాయుగాంతంబునన్
రాజై పుట్టితి వింక నీకలియుగాంత్యంబందునన్ రౌతవై
వాజిం దోలి విరోధులం దునుమ దేవా నీవ యొండెవ్వఁ డా
రాజున్ రౌతును నీవె కావె రఘువీరా! జానకీనాయకా! ౧౦

శా. గాజుంబూస సురేంద్ర నీలమణిఁగాఁ గల్పించుచందంబునన్
భాజుం? జర్మము మీఁది బేగడపొరల్ బంగార మౌరీతిగన్
నా జన్మంబుఁ బవిత్రభాజనముగా నన్నేలరా యేలరా
రాజీవాక్ష! కృపాకటాక్ష! రఘువీరా! జానకీనాయకా! ౧౧

శా. నా జన్మాంతర వాసనావశమునన్ నాపాలిభాగ్యంబునన్
నా జాడ్యంబులు పోవుకాలముతటిన్ నాపుణ్యపాకంబునం
దీజన్మంబున నిన్నుఁ గొల్వఁ గలిగెన్, హీనుండఁ గా నింక, నే
రాజన్, నాకెదు రెవ్వ రుర్వి? రఘువీరా! జానకీనాయకా! ౧౨

శా. నేఁటం దీటౌ ననేకజన్మములనుండి న్నన్ను వెంటాడుచున్
వాటంబై చనుదెంచు పాపములు; శ్రీవత్సాంక! నీవంక నీ
పాటల్ పాఠము సేయువారికి మఱిం బాపంబులం బాపుఁ గ
ర్ణాటాధీశ్వర! యొంటిమిట్ట రఘువీరా! జానకీనాయకా! ౧౩

మ. పటునిర్ఘాత కఠోరనాదము ఘనబ్రహ్మాండ భాండంబుఁ బి
క్కటిలం జేయుచు వచ్చునప్పు డితరుల్ గాండీవినామంబు లె
న్నుట మేలందురు; వైష్ణవుల్ తలఁప రన్యం గోరి యెంతెంతదు
ర్ఘటముల్ వచ్చిన నిన్నెగాక రఘువీరా! జానకీనాయకా! ౧౪

మ. కొడుకు ల్బ్రహ్మలు, కూఁతు రీశ్వరశిరః కూటంబుపైఁ గాఁపురం,
బుడురాజుం దినరాజుఁ గన్ను, లహిరా జుయ్యాలమంచంబు, నీ
పడఁతుల్ శ్రీయు ధరిత్రియున్, సవతు చెప్పన్ లేరు నీకన్యు; లా
అడి మర్త్యు ల్గనలేరుకాక రఘువీరా! జానకీనాయకా! ౧౫

ఉ. వడి మీఁ బంగ నమోఘమై నిగుడు నీ వాలమ్ము వాలమ్ముఁ దాఁ
కెడునంచుం బెడయొడ్డినన్ జమరిపైఁ గీల్కొన్న కారుణ్యమే
ర్పడ మున్నేసిన యమ్ము వేఱె యొక నారాచమ్మునం ద్రుంచి పే
ర్పడి తౌరా విలుకాండ్రలోన రఘువీరా! జానకీనాయకా! ౧౬

మ. చెడుగం, గష్టుఁడ, దుష్టచిత్తుఁడఁ, బరస్త్రీలోలుఁడన్, బాలుఁడన్
జడుఁడన్, మూఢుఁడఁ, గొండెకాఁడను, దురాచారి, న్నిషిద్ధాత్ముఁడన్
గడుసం గాకరి గల్లగుల్లఁ గపటిన్ గర్విన్ ననుం గావు మూ
ఱడియున్నాఁడను నీవె దిక్కు రఘువీరా! జానకీనాయకా! ౧౭

మ. అడుగున్విద్యకు లోనుచేసితివి న న్నావంత నావంతలే
కడియాసల్ గొనుచుం దురాత్మకుల నే నర్థించుచున్నాఁడ; నె
న్నఁడు రక్షించెదు, నీవు నన్ను బలె నెన్నం బేదనా? యేల యా
ఱడిఁ బెట్టంగ? రమావిహార! రఘువీరా! జానకీనాయకా! ౧౮

మ. ప్రణుతింపన్ మృతదేహులఁ జూచి బ్రదికింపన్ బ్రహ్మరుద్రుల్ మరు
ద్గణనాథాదులు నోప, రద్భుతము గాఁదా నీదుభృత్యుండు ల
క్ష్మణు ప్రాణంబులు దెచ్చెఁ జచ్చినతఱిన్ సంజీవనీప్రక్రియన్
రణభూభాగములోనఁ దానె రఘువీరా! జానకీనాయకా! ౧౯

శా. ఏతాత్పర్యము గల్గి కొల్చెదవురా? యేనేల నిన్నెత్తురా?
నీతో నాకుఁ బనేమిరా? యనక మన్నింపం దగున్; మున్ను నీ
చేతన్ మోక్షముఁ గన్నవారి వినమా చిత్రంబుగా నిగ్గరా
రాతిన్ నాతిని రాతిఁ దొల్లి రఘువీరా! జానకీనాయకా! ౨౦

శా. దాతల్ భ్రాతలు తల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్
భ్రాతల్ పెక్కినవారు చుట్టములు మీపాదాలపై నాన నా
దాత భ్రాతలు తల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్
భ్రాతల్ సర్వము నీవెకావె రఘువీరా! జానకీనాయకా! ౨౧

మ. శ్రుతిపాథోధి మథించి శాస్త్రమహిమ ల్శోధించి యష్టాదశ
స్మృతు లాలించి మహేతిహాసకథలుం జింతించి తా రొక్కస
మ్మతమై సన్మను లాచరించినమహామార్గంబునీసేవ; దు
ర్మతు లీమార్గముఁ గానలేరు రఘువీరా! జానకీనాయకా! ౨౨

మ. మతి నూహింపరు కొంద ఱీసుకృత మేమార్గంబునం దున్న ను
గ్రతపోధ్యానము సామగానమును దీర్ఘస్నానమున్ దానమున్
క్రతుసంధానము లేల? నేలఁ దులసిం గర్వయ్యెనో? యూర నీ
ప్రతిమ ల్లేవో నమస్కరింప? రఘువీరా! జానకీనాయకా! ౨౩

మ. సుతు లంచున్ హితు లంచు బంధుజను లంచుం దల్లులుం దండ్రులున్
సతులుం బౌత్రులు నంచు నెంచుకొనుచున్ సంసారమోహాబ్ధిలో
గతజన్మంబులఁ దేలుచున్ మునుఁగుచున్ గర్వించి యే నిన్ననా
రతముం గొల్వని మోస గల్గె రఘువీరా! జానకీనాయకా! ౨౪

మ. క్షితిలోఁ దామును బ్రహ్మసృష్టికిఁ బునస్సృష్టిన్ వినిర్మించియున్
క్రతువిఘ్నం బొనరించు దానవుల వీఁకం దోలఁగా లేక నాఁ
డతి బాలున్ నినుఁ దోడు తోడుకొనిపోఁడా గాధిసూనుండు నీ
ప్రతివీరాగ్రణి యెవ్వఁ డింక? రఘువీరా! జానకీనాయకా! ౨౫

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పినకృతుల్ ఛీఛీ నిరర్థంబులౌ
నుతిపాత్రమ్ములు గావు మేఁక మెడచన్నుల్ నేతిబీఱాకులౌ;
వితతప్రౌఢిమ నీకుఁ జెప్పినకృతుల్ వేదాలు శాస్త్రాలు భా
రత రామాయణముల్ దలంప రఘువీరా! జానకీనాయకా! ౨౬

శా. సంతానంబును బారిజాతకమహీజాతంబు మందారమున్
జింతారత్నముఁ గామధేనువు సుధాసింధూత్తమంబున్ మదిన్
జింతింపన్ సరిగావు నీకు విజయశ్రీధామ యోరామ య
శ్రాంతత్యాగ వివేకపాక రఘువీరా! జానకీనాయకా! ౨౭

శా. ఏదైవాలవరాలకంటె సులభం బెవ్వారికైనన్ మదిన్
నీదాత్మత్వము చెప్పనేల శరణంటేన్ గాతు వింతేల నీ
పాదాంభోజరజంబు రాతికయినన్ బ్రాణంబు లీఁజాలు నౌ
రా దిక్పూరితకీర్తిపూర రఘువీరా! జానకీనాయకా! ౨౭

శా. విందున్ వేదపురాణశాస్త్రముల గోవిందున్ ముకుందున్ హరిన్
విందున్ వేల్పులలోన భక్తసులభున్ విశ్వంభరున్ సచ్చిదా
నందున్ నందుఁడుకన్న శిశువున్ నాపాలిపాపాలిఁ బా
ఱం దోలంగ నృసింహు నిన్ను రఘువీరా! జానకీనాయకా! ౨౮

శా. సందిం బూసలలోన నీకవచరక్షామంత్రరాజంబుఁ బెం
పొందన్ వ్రాసి ధరించి నాతఁడు రిపువ్యూహంబులో నైన నే
కందుం బొందక వజ్రపంజరములోఁ గాపున్న చందానఁ బా
ఱందోలుం బగవారి నౌర రఘువీరా! జానకీనాయకా! 30

మ. వృథగా దెవ్వఁడు నిన్నుఁ గొల్చినఁ గృపన్ వీక్షించి వాఁ డేమనో
రథముల్ వేఁడిన నట్లె సేయుదువు గా రక్షావిధేయుండవై
కథగా నీవచనంబు నిక్కమటులే కాదేని మున్నేల సా
రథివై తర్జునుతేరిఁ దోల రఘువీరా! జానకీనాయకా! 3౧

మ. ఘనసారంబును లోనికిం గొనిన శ్రీగంధంబుఁ బైఁ బూసినన్
దినముల్ మర్దనఁ జేసినం గడిగినన్ దృష్టంబు లోనం దొలం
గని దుర్గంధము నైజ మీముటకి డొక్కల్ నమ్మి నిన్గొల్వనే
రని మూఢాత్ముల నేమి చెప్ప రఘువీరా! జానకీనాయకా! 3౨

మ. ఇనుమా రాశ్రితు నిల్వ; వాడ వినుమా రేమాటయున్; సాయకం
బినుమా రాహవభూమిఁ బూన; విదిగా కింకొండు మేలందు నీ
వినుమా రీ దురితాంధకారపటలం బేరీతి వీక్షింతు? వు
గ్రనిశాటాంతక రామభద్ర! రఘువీరా! జానకీనాయకా! 33

మ. మునునే నెన్నఁడు వేదశాస్త్రపఠనంబులో రిత్తతీర్థాటనం
బును దానంబును జేయఁబోను సతతంబున్ నిన్ను సేవించి కీ
ర్తనఁ జేయన్ మతిలేదు దానమున కర్థం బల్ప మింకెట్లు భో
రన నా దుష్కృతముల్ దొలంగు? రఘువీరా! జానకీనాయకా! ౩౪

మ. విను నా కెన్నియొ దోసముల్ గలవు నొప్పిం బొందఁగా మ్రింద ర
మ్మని రౌద్రంబుగఁ గాలుబంటు లనఁగ న్నాఁపేరు? నా పేరుఁబె
ట్టిన వానిన్ బరలోకదూరుఁడని యండ్రే పొందు పొందంచు బో
రన సాయమ్మయి యడ్డగింపు రఘువీరా! జానకీనాయకా! ౩౫

మ. అనఘుంబైన దశాశ్వమేధకృత పుణ్యస్ఫూర్తి నీకొక్క మా
టు నమస్కారము సేయఁగల్గునని విందున్; యాగధర్మంబులున్
గొనసాగుం; జననంబు లుక్కడఁగు నీకున్ మ్రొక్కనేనిన్ బున
ర్జననంబేది దలంచి చూడ రఘువీరా! జానకీనాయకా! ౩౬

మ. దనుజారి జ్వల నాంత కాసుర సముద్రస్వామి వాయు త్రిలో
చనమి త్రాభవ సూర్యసోమధరణీజా తాంబుజాత ద్విష
జ్జననాంగీరస శుక్రభానుతనయ స్వర్భానుకేతుప్రవ
ర్తనముల్ నీ విభవంబులౌర రఘువీరా! జానకీనాయకా! ౩౭

మ. కనుఁగొన్నప్పుడె గుప్పఁడే కుజనులం గాలుండు కాలుండు పొం
డనుచున్ రౌరవనారకాగ్నులఁ బడన్ హత్తించి, యయ్యగ్నుల
న్మనుఁగం జాలఁ బరేతరాజునకు న న్నొప్పింపఁగాఁ బోవ కు
గ్రనిశాటాంతక రామభద్ర! రఘువీరా! జానకీనాయకా! ౩౮

మ. నిను సేవించెద నంచుఁ గోరుకొనియున్నన్ వానికిం బూర్వక
ర్మనిమిత్తంబులు కష్టముల్ గలుఁగఁగా మన్నించి నీవడ్డ మా
దని చెప్పంబడు, ద్రౌపదిం గరిని బ్రహ్లాదున్ ధ్రువున్ మున్ను బో
రన రక్షించుట కల్లా లేదా రఘువీరా! జానకీనాయకా! ౩౯

మ. అనిశంబుఁ నినుఁ గొల్చు మానవులు ప్రాణాంతంబునఁ రోగబా
ధ నిమిత్తంబున రామరామ యనుచుఁ దల్పంగ లేకుండినఁ
జననాథాగ్రణి నీవు వారి రసనాస్థానంబున న్నిల్చి భో
రన రామా! యనిపింతు వౌర రఘువీరా! జానకీనాయకా! ౪౦

మ. ఇనవంశోత్తము! వేదశాస్త్రములలో నే వింటి నేవింటివాఁ
డును నీకుం బ్రతిగాఁడు, నీకుఁ గలబంటు, న్నన్ను రక్షింపు; కా
లుని బంట్లఁ విదళింపఁగావలయు, నాలో నుండుమీ గండుమీ
అ నమోఘాస్త్రము విల్లుఁ బూని రఘువీరా! జానకీనాయకా! ౪౧

మ. జననాథాగ్రణి నిన్నుఁ గొల్చునతఁ డాచండాలుఁడైనం బున
ర్జననం బొందక ముక్తిఁగాంచు నొనరఁ సద్భక్తుఁడైనం దుదిఁ,
జనుఁ జండాలకులంబులోన నుదయించంగోరి నీ నామకీ
ర్తన సేయ న్నిరసించెనేని రఘువీరా! జానకీనాయకా! ౪౨

మ. జనకుం డెవ్వఁడు నీకు? నీకడుపులో సర్వంబు నుండంగ నీ
యునికి స్థానము దుగ్ధవార్ధి నడుమఁ యోగీంద్రహృద్గేహ! యే
మని వర్ణింపుదు నీమహత్త్వములు సర్వైశ్వర్యముల్ పుణ్య వ
ర్తనరాజన్యయశోవిహార రఘువీరా! జానకీనాయకా! ౪3

మ. జనకుండా జనకుండు నీసతికిఁ, గౌసల్యా యహల్యాఘమో
చన నిఁ గాంచినతల్లి, పంక్తిరథుఁడా సర్వేశ మీతండ్రి, యే
మినిమిత్తంబున నుద్భవించితివో నెమ్మి న్నిట్టు లీపుట్టు వు
గ్రనిశాటాంతక రామభద్ర రఘువీరా! జానకీనాయకా! ౪౪

మ. హనుమంతుం డొకయబ్ధి దాఁటె నని యేలా ప్రస్తుతుల్ సేయఁగా
దనుజారాతి! భవత్పదాబ్జములు హృత్పద్మంబున న్నిల్పినా
ఘనపుణ్యుండు భవాంబురాసులు తృణీకారంబుగా దాఁటు బో
రననైన్నెనను గొంకులేక రఘువీరా! జానకీనాయకా! ౪౫

శా. నీపాదోదక మత్షులం దదుముకొంటిం, గొంటి నాలోనికిన్,
నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్, నీపేరునుం బెట్టితిన్,
నీపెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్, నీవింక నన్నేగతిన్
బ్రాపై ప్రోచెదొ కాని పూని రఘువీరా! జానకీనాయకా! ౪౬

మ. తపముల్ చేసినఁ బోనిపాపములు మంత్రంబుల్ సమర్థంబుగా
జపముల్ చేసినఁ బోనిదోషము నదీస్నానంబునం బోని ఘో
రపుఁగర్మంబులు వాయు నొక్కమరి శ్రీరామా యనన్మాట క
ర్ణపుటం బించుక సోఁకెనేని రఘువీరా! జానకీనాయకా! ౪౭

మ. కంపింతున్ మును దండధారికిని మత్కాయంబు వీక్షించి శం
కింపం గారణ మేమి నాకిఁక నినున్ గీర్తించుచున్నాఁడఁ; బల్
దుంపల్ గట్టిన ఘోరపాపముల సంధు ల్గోసి వేయంగ బల్
అంపంబైనది నీచరిత్ర రఘువీరా! జానకీనాయకా! ౪౮

శా. నీమంత్రంబు సదా సదాశివుఁడు పత్నీయుక్తుఁడై కాశిలో
నేమం బొప్ప జపించె నంచు శ్రుతులన్నిన్నిన్నె వర్ణింపఁగా
నేమా నిన్ను నుతించువార మయినన్ నిన్నెంతు నోరారఁగా
రామా రాఘవ రామభద్ర రఘువీరా! జానకీనాయకా! ౪౯

శా. నీమంత్రంబు జపించు మానవులకున్ నిశ్శ్రేయ మౌ నర్థముల్
హేమంబు ల్గొడుగుల్ తురంగములు మత్తేభంబు లాందోళికల్
గ్రామంబుల్ నగరంబులున్ విభవముల్ రాజ్యంబులున్ రత్నముల్
రామారత్నము లేమిలెక్క రఘువీరా! జానకీనాయకా. ౫౦

శా. గోమేధాధ్వర వాజిమేధశతముల్ గోదాన భూదానముల్
హేమాద్రుల్ తిలపర్వతంబులు సువర్ణేభాశ్వదానంబులున్
నీమంత్రంబగు నక్షరద్వయముతో నే పుణ్యముల్ పోల వో
రామా రాఘవ రామభద్ర రఘువీరా జానకీనాయకా! ౫౧

శా. గోమాంసాశని, మద్యపాని, నగరిన్ గొండీఁడుఁ, చండాలుఁడున్
హేమస్తేయుఁడు, సోదరీరతుఁడు, గూడే కాదశిన్ భుక్తిగొ
న్నామూఢాత్ముఁడు లోనుగాఁగలుగు దుష్టాచారుఁడైనం దుదిన్
రామా యన్నను ముక్తిఁగాంచు రఘువీరా! జానకీనాయకా. ౫౨

శా. ఏమీ పాతకులార! మాపురికి రా రీపట్టునం దున్నత
శ్రీమైఁ బోయెద రెందుకన్న జమునిం ద్రేఁగన్నులం జూచుచున్
రామయ్యా యిఁక నంచుఁ బల్కి యపవర్గస్వర్గముల్ చొత్తురో
రామయ్యా! నినుఁ గొల్చువారు రఘువీరా! జానకీనాయకా! ౫౩

శా. స్వామిద్రోహికిఁ దమ్ముఁడెట్లు? ఘనరాజ్యంబేల నీవిచ్చె?
ట్లామాటల్ వినికాదె నిన్నడుగ నత్యాసక్తి నాకున్న దొ
డ్డేమీ ప్స్యఁబు వేసరింపఁగవి నే నీరాజసీమలో
గ్రామం బొక్కటి చాలు నాకు రఘువీరా! జానకీనాయకా! ౫౪

శా. మా మా యంచును మాను యంచు నెపుడున్ మాయల్లుఁ డుద్యద్గతిన్
హేమాద్రిప్రతిమానమైన హనువి ల్లేపార మో పెట్టఁగా
సామర్థ్యంబున వీఁడు మేటియని నీసత్త్వంబు వర్ణింతు నో
రామా రాఘవ రామభద్ర రఘువీరా! జానకీనాయకా! ౫౫

మ. కమురంద్రాఁగిన లోభి వానితల పుఱ్ఱం, గుక్కమాంసంబు మ
ద్యముతో వండుచుఁ దిన్న మాలఁడయినం, దత్పాపకర్మంబులన్
యమకూపంబులలోపలంబడఁడు జిహ్వాగ్రంబునన్ రామమం
త్రముఁ బేర్కొన్నను నొంటిమిట్ట రఘువీరా! జానకీనాయకా! ౫౬

మ. యమకూపంబులలోపలంబడి మహాహైన్యంబునుం బొందకుం
డ ముదంబారఁగ నన్నుఁ బ్రోచికరుణన్ సాయుజ్యమిమ్మా తుదిన్
క్రిమికూపుం దనకూపుగాఁ బెనిచి రక్షింపన్ విచారించునా
భ్రమరంబుంబలెఁ బాపదూర రఘువీరా! జానకీనాయకా! ౫౭

మ. మమకారంబున సర్వకాలమును నీమంత్రంబు వాక్రుచ్చు డెం
దము నాకుం గలుగంగనిమ్మటులయైనన్ మృత్యువక్త్రమ్ముఁ దూ
రము; నిన్నున్ మతి దూఱ మంత నపవర్గస్వర్గమార్గంబు దూ
రము గాకుండును మాకుఁ జేర రఘువీరా! జానకీనాయకా! ౫౮

మ. తమగర్వంబునఁ దారు పొంగిపడుచున్ దైవంబు మంత్రంబు తం
త్రములన్ వీడఁగనాడుచున్ దిరుగునిర్భాగ్యుల్ మహారాజులై
మఱు నూరింపఁగ నేము నిన్నెఱిఁగి నీమంత్రం బెఱింగిన్ దరి
ద్రమతిన్ వేడఁగఁ బోవు టెట్లు రఘువీరా! జానకీనాయకా! ౫౯

మ. హిమధామప్రతిమానకాంతియుతులై యింద్రాది దిక్పాలకుల్
తములన్ స్తోత్రముచేయ నుందురు నీదాసానుదాసుల్ సుర
ప్రమదాపల్లవ పాటలాధరసుధా పానాదికేలీవిహా
రములన్ మీఱుచు మీరు చూడ రఘువీరా! జానకీనాయకా! ౬౦

శా. మిమ్మం గొల్చి తలంచి పాపముల నెమ్మిం సోఁకి రానీక నే
నెమ్మిన్ సౌఖ్యముఁ బొందువాఁడ ననుచున్ నీమూర్తి భావించెదన్
రమ్మా వీనితలంప మేలని కృపన్ రక్షించి నాలోనికిన్
రమ్మా నన్నుఁ గృతార్థుఁజేయ రఘువీరా! జానకీనాయకా! ౬౧

మ. ప్రమదారత్న మహల్య గౌతముని శాపప్రాప్తి పాషాణరూ
పముతోఁ బెక్కుయుగంబులుండఁగ హరబ్రహ్మాదులుం బాపలే
ని మహాపాపము పాపనోపినదిగా నీపాదరేణుప్రకా
రము నేనేమని సన్నుతింతు రఘువీరా! జానకీనాయకా! ౬౨

శా. నాయజ్ఞానముఁ బాపుమంచు మదిలో నానాప్రకారంబులన్
గూయంగూయ నదేమిరా యనవు నీకున్ మ్రొక్కనా? కుక్కనా?
చీ యంచేటికి రోఁతగించెదవు? నీచిత్తంబు రాకుండినన్
బ్రాయశ్చిత్తము నాకునెద్ది? రఘువీరా! జానకీనాయకా! ౬౩

మ. నియమంబొప్ప ననేకజన్మములనుండిన్ దాఁచుకొన్నట్టిసం
చయదోషంబులు మాటమాత్రమున దోఁచంబోవువారత్వ మె
న్నియుపాయంబుల నభ్యసించినదియో నీనామముల్ వేయు నా
రయ నిన్నున్ వివరించు కెట్లు రఘువీరా! జానకీనాయకా! ౬౮

మ. సకృపాలోకన! నందగోపుని తనూజాతుండవై గొల్లవై
సకలక్షోణుల నేలినాఁడవఁట, మించం గశ్యపబ్రహ్మగ
న్నకుమారుండన మిన్నుముట్టి కుఱుచై నాఁ డేల నాఁడేల నే
రక దానంబుగ వేఁడుకొంటి రఘువీరా! జానకీనాయకా! ౬౯

శా. చీరల్ దీయకు చన్నుగుబ్బలపయిం జేకాకుగాఁ గాకుగాఁ
జీరల్ దీయఁగ మందబోయఁడిదె వచ్చెన్ ప్రొద్దురావల్లునా
జాఱల్ మేనను జారలం గవయు కృష్ణా యేకపత్నీవ్రత
ప్రారంభం బిపుడేల నీకు రఘువీరా! జానకీనాయకా! ౭౦

మ. తిరునామంబు ధరింపఁ డేని నొసలన్ దిక్పూరితంబైననీ
వరనామంబుఁ దలంపఁ డేని మదిలో వాంఛించి నీపాదపం
కరుహశ్రీతులసీదళోదకముఁ ద్రావం డేని వాఁ డేటి నే
ర్పరి వైకుంఠపురంబుఁ జేర రఘువీరా!. జానకీనాయకా! ౭౧

మ. శరణంబన్నను మాటమాత్రమున విశ్వద్రోహి తోఁబుట్టునన్
గరుణాపూర్ణవిలోకనంబొదవ లంకారాజ్యసింహాసన
స్థిరపట్టంబొనరించినాఁడ వఁట యేదేవుండు నీసాటి యు
ర్వరలోనన్ భవరోగదూర రఘువీరా! జానకీనాయకా! ౭౨

మ. వరనారీ కుచకుంభపాలికలపైఁ బాదాబ్జయుగ్మంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలతటిపై గంఠంబుపైఁ గొప్పుపై
బరువుల్ వాఱెడు నాతలంపులు మిముల్ భావింపఁగాఁ జేసి స
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘువీరా! జానకీనాయకా! ౭౩

మ. నరకుం ద్రాఁగిన యిన్పకంబముల నంటంగట్టఁగాఁ గొట్టఁగాఁ
బొరలంబోర్లఁగఁ గక్కురాలఁగొని వీఁపుల్గోయఁగా ద్రేయఁగా
నరకావాసులలోననుండుదురు నీనామంబువర్జించి దు
స్తరణంబు ల్గని చన్నవారు రఘువీరా! జానకీనాయకా. ౭౦

మ. పురసంహారుని చాపముం జివుకువంబుం ద్రుంచి పోఁజూచినం
బరశూదగ్రభుజుండు పోవిడుచు నే భంజించుఁగాకంచు ని
ష్ఠురముల్ పల్కిన భార్గవుం భుజబలాటోపంబువారించి ని
ర్భరశాంతంబునఁగాచితౌర రఘువీరా! జానకీనాయకా! ౭౧

మ. స్మరసంహారుఁడు గోరి పొత్తున భుజింపం బిల్వ నే రాను, శ్రీ
హరినామంబులు వేయునెన్నవలె నిత్యంబైననోమన్న నో
యరవిందానన వేయునేటికిని రామా యన్ననుం జాలు మం
త్రరహస్యంబుఁ దలంతునేను రఘువీరా! జానకీనాయకా! ౭౨

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథా పాపంబు దుర్బుద్ధినై
చాలం జవ్వనమందు గర్వమతినై సంసారినై, దుష్క్రియా
జాలభ్రాంతిఁ జరింతుఁగాని నినుఁ గాంక్షం గొల్వలేదయ్యె హే
రాళంబైనది చింత వంత రఘువీరా! జానకీనాయకా! ౭౩

శా. సాలగ్రామ శిలాశిలోచ్చయ గయాస్నాన ప్రయాగస్థలుల్
పోలం జూచెద నంచుఁ బోవఁదలఁతుం బోలేను మీదాసులం
బోలం గానఁగ బుద్ధిపుట్టదిఁక నేఁ బుణ్యాత్ముఁ డౌటెట్లు? హే
రాళంబైనది చింత వంత రఘువీరా! జానకీనాయకా! ౭౪

మ. కొలువంజాలక మాన, నీనుతులు పెక్కుల్ సేయుటం మాన, నిం
దలఁపంజాలక మాన, నేఁగలసి నీ దాసానువర్గంబుతో
నిలువంజాలక మానఁ, బో కడపటం నీనామముల్ విన్నవా
రలకుం గల్గును మోక్షలక్ష్మి రఘువీరా! జానకీనాయకా! ౭౫

మ. తలఁపం జిత్రము మీమహత్త్వములు మీ దాసుల్ మహాభాగ్యవం
తులు త్రైలోక్యమునన్ బదస్థుఁడు ధ్రువుం డుండున్ నభోమండలిన్
బలి పాతాళమునన్, విభీషణుఁడు భూభాగంబునం, బద్మజ
ప్రలయంబైనను బోవరౌర రఘువీరా! జానకీనాయకా! ౭౬

మ. చెలఁగన్ మర్త్యులు వేగి లేచి తమిచేఁ జేయంగఁ బాపంబు లీ
కలుషంబుల్ పెడఁబాయు టేదిగతి? యింకన్ ద్రోవ యొండెద్ది? పు
ర్వ్యళుగుంటంబడఁ బోవనీక దయ నేర్పన్ బుద్ధియుం గల్గువా
రలు నీసేవకు లౌట లెస్స రఘువీరా! జానకీనాయకా! ౭౭

మ. కలకాలంబు వ్రతంబులుం దపములుం గావించి యన్యుల్తుదిన్
గలకాలంబునుబోలె నిర్జరపురీ కాంతాకుచాలింగనం
బులఁ గొన్నాళ్లు సుఖించి క్రమ్మఱ నిలం బుట్టంగ నే మెచ్చ ని
ర్మలముక్తుల్ నినుఁ గొల్చి కాంతు రఘువీరా! జానకీనాయకా! ౭౮

మ. నిలువెల్లం బులకాంకురంబు లొదవన్ నీపాదతీర్థంబుతోఁ
దులసీపర్ణ మొకించుకంత గొనినన్ దోషాలు ఖండింపఁగాఁ
బొలపాకుల్ దినఁ గాననంబులబడిన్ బోనేల మోక్షంబు కూ
రలను న్నారల నేల గల్గు? రఘువీరా! జానకీనాయకా! ౭౯

మ. చెలువంబొప్ప సువర్ణముద్ర లితరుల్ చెల్లించుటే క్రొత్త, కా
కలనీముద్రలు చూడఁ జెల్లుబడి చక్రాలంచు వేయించుమం
డలనాథాగ్రణి క్రొత్త, నీబలిమి నానావర్ణపుం దోలుము
ద్రలు చెల్లించితి విందు నందు రఘువీరా! జానకీనాయకా! ౮౦

మ. ప్రళయాపాదితకాలమృత్యువగు నా రాకాసిరా కాశివా
దులు వారింపఁగ నేర రింక నెటఁ జొత్తుం జత్తుఁ గాకన్న సం
చలితుం గౌశికుఁ గాచి తాటక మహాస్త్రజ్వాలచేఁ ద్రుంచి దో
ర్బలశక్తిన్ విలసిల్లితౌర రఘువీరా! జానకీనాయకా! ౮౧

మ. చిలుకన్ ముద్దులు చిల్కపల్కుతతి రాజీవాక్షి యొక్కర్తు ని
చ్చలు రామా రఘురామ రావె యనినన్ సాలోక్యసామీప్యముల్
కొలఁదు న్మీఱంగ నిచ్చినాఁడవఁట నీకున్ బిడ్డపే రిడ్డనా
రలపుణ్యంబున కెద్దిమేర రఘువీరా! జానకీనాయకా! ౮౨

మ. ఇల నిన్నుం దొలుబామునం దలఁప నే నీజన్మమందైన నా
తలఁపు న్మీపదపంకజంబులపయిన్ దాపింతు నే నింక బు
ట్టలలోఁ జెట్టులలోన నంబువులఁ బుట్టం బుట్టఁగా నోపఁ గ
ర్మలతాబంధము మాపవయ్య రఘువీరా! జానకీనాయకా! ౮౩

మ. ఇల నీమీఁదను జాలభక్తిగలవాఁ డేచెట్టవాఁడైన నే
ఖలుఁడైనం దుది నుత్తమోత్తముఁడగున్ గాదన్నఁ గొంగిడ్చెదన్
దెలుప న్నిల్చిన నాడు కొన్నపరవాదిన్ గెల్చెదన్ వేదశా
స్త్రలసద్వాక్యనుతప్రతాప రఘువీరా! జానకీనాయకా! ౮౪

శా. దేవా! నాదొకవిన్నపంబు గల దేదీ యంటివా వింటివా
త్రోవం దండధరుండు దుర్గతులకై త్రోవన్ విచారించునో
యేవిఘ్నంబొనరించునో యెఱుఁగరా దే ముక్తికిం బోవుచో
రావే వెంబడి నింతనంత రఘువీరా! జానకీనాయకా! ౮౫

శా. గోవం ద్రొల్తటిజన్మకాలముల నీకుం బంటఁ గానైతి నం
చీవక్రంబులె కాక నాకు నివి లక్షింపంగ జన్మంబులా
చావుం బుట్టువు మాన్పకోవలయు నీజన్మాన నీవాఁడనై
రావా నామది కింక నైన రఘువీరా! జానకీనాయకా! ౮౬

శా. చావు ల్మర్త్యులకెల్లఁ గల్గుటలు నిస్సందేహముల్ దేహముల్
చేవ ల్గల్గినినాఁడె శ్రీగిరి గయా శ్రీవేంకటాహోబల
గ్రావప్రాంతములందుఁ జేరవలెఁ; జేరంబోవ కేలబ్బు నా
ర్యావాణీస్తుత మోక్షలక్ష్మి రఘువీరా! జానకీనాయకా! ౮౭

శా. త్రోవన్ మానవుఁ డొంటిఁబోవుతఱి నీస్తోత్రంబు వాక్రుచ్చినన్
నీవుం దమ్ముఁడుఁ దోడువత్తురటె నీనెయ్యంబు తియ్యంబుగా
నీవంటాప్తుఁడు నిన్నుఁబోలుహితుఁడున్ నీవంటిభక్తప్రియ
ప్రావీణ్యుండును లేఁడు చూడ రఘువీరా! జానకీనాయకా! ౮౮

మ. నవనీతంబుల కేల పాఱెదవురా నాయన్నరా యెన్నరా
యివి దూష్యంబులుగాఁగ గోపికలు? నీయింటం బదార్థంబు లె
య్యవి లే? వంచు వచించునమ్మకడ కొయ్యాంజేరుకైశోరచో
రవినోదంబులు నేఁదలంతు రఘువీరా! జానకీనాయకా! ౮౯

మ. వివిధబ్రహ్మల యంత్యకాలముల నేవే నిల్వ వావేళలన్
ధ్రువుఁడో యొండె విభీషణుండు బలి యుందుర్ వారు నీదాసులై
నవిశేషంబునఁగాక తక్కొరుల కుండంబోలునే యింద్రరు
ద్రవిరించిస్తుత శౌర్యసార రఘువీరా! జానకీనాయకా! ౯౦

మ. చెవి నీనామము విందునో యనికడున్ సెంకించి కర్ణంబులన్
రవము ల్మీఱిన ఘంట లంటనిడి ఘంటాకర్ణుఁ డేతేరఁగా
నవి చూచిన్ వరమిచ్చినాఁడవఁట నీయంఘ్రిద్వయీసేవక
ప్రవరుం గాచుటయేమిలెక్క? రఘువీరా! జానకీనాయకా! ౯౧

మ. రవిసూనుం బరిమార్చి యింద్రసుతునిన్ రక్షించినావందునో
రవిసూనుం గృపనేలి యింద్రసుతుఁ బోరం ద్రుంచినావందునో
యివి నీయందును రెండునుం గలవు; నీ కేదిష్ట మౌనో కదా
రవివంశాగ్రణి! తెల్పవయ్య రఘువీరా! జానకీనాయకా! ౯౨

శా. దోసంబు ల్కులపర్వతంబులకొలందుల్ గల్గినం గల్గనీ
మీసంకీర్తన శబ్దమాత్రమున భస్మీభూతమైపోవవా
త్రాసు ల్కోటి సహస్రముల్ గలిగి యెత్తన్ రానికార్పాసపున్
రాసు ల్సోఁకిన నిప్పువోలె రఘువీరా! జానకీనాయకా! ౯౩

మ. కసుమాలంబగు దేహపుట్టువుల నీకష్టంబులం బాపి ది
వ్యసుకాయం బొనరింతు వెవ్వఁడు నిన్ వాక్రుచ్చినన్ యోగిమా
నసగేహంబులనుండి; లోహము సువర్ణచ్ఛాయగాఁ జేయఁగా
రసవాదంబులు నేర్చితౌర రఘువీరా! జానకీనాయకా! ౯౪

మ. పసులంగాచిన గొల్లవాఁడవనుచున్ భావింతు నెంతున్ మదిన్
ముసలిప్రాయమువాఁడవైతివనుచున్ మూర్తిత్రయాకారునిన్
వసుధాధీశ్వరు నెంతు నిక్కమెఱుఁగన్ సర్వాపరాధిం గృపా
రసపాథోనిధి! కావవయ్య రఘువీరా! జానకీనాయకా! ౯౫

మ. పిసినింజూచి మహాప్రదాతయనుచున్ బీభత్సకుత్సాంగునిన్
బ్రసవాస్త్రప్రతిమానరూపుఁడనుచున్ బందం బ్రియంబంద శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబుగావించునీ
రసుఁడన్ నిన్ను నుతింపనేర రఘువీరా! జానకీనాయకా! ౯౬

మ. బహురూపాలు ధరించుకొంచును గ్రియాభాషాంగము ల్పుట్టఁగా
బహుకాలంబులనుండి యాడితి నిఁకం బ్రొల్మాలినట్లయ్యెడిన్
దహలం బెట్టక చాల్పు రేయనుము నీత్యాగంబు నేనొల్ల సా
గ్రహదైతేయ మదాపహార రఘువీరా! జానకీనాయకా! ౯౭

శా. మోక్షాపేక్ష జనించె నాకు నిదియేమో కాని యీజన్మమం
దక్షీణోదయముక్తి కెవ్వఁడొడయం డాపుణ్యునిం జెప్పెదో
దక్షారిస్తుత నీవె కర్తవయినన్ దక్కొల నీవే నన్
రక్షింతో యెఱుఁగంగఁ జెప్పు రఘువీరా! జానకీనాయకా! ౯౮

మ. అక్షీణప్రతిమానదానవిభవాహంకారపారీణ! యో
రక్షోదైత్యమదాపహార విబుధా త్రైలోక్యసంరక్షకా!
దక్షధ్వంసవధూటికావినుత! నీదాసానుదాసుండ నన్
రక్షింపంగదవయ్యరామ రఘువీరా! జానకీనాయకా! ౯౯

మ. చదువు ల్దొంగిలి సోమకాసురుఁడు భాషాభర్త కూపెట్టఁగా
నుదధుల్ సొచ్చినఁ బాటిపట్టుటకు నుద్యోగించి మత్స్యంబవై
యదరంటన్ రిపుఁద్రుంచి వేదములు దేవా దేవ! శాండిల్యనా
రదకౌండిన్యనుతప్రతాప రఘువీరా! జానకీనాయకా! ౧౦౦

మ. [1]అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో నత్యంతగర్వంబునన్
దమసత్త్వంబుల మందరాచలముచేఁ దర్వంగ నంభోధిలో
రమణం దద్గిరి మోచి కాచినజగత్ప్రాణుండ కూర్మావతా
ర మనంగా మఱి నీవెకావె రఘువీరా! జానకీనాయకా! ౧౦౧

మ. ధర కల్పాంతమునం గరంగఁబడి పాతాళంబులోనంటినన్
దొరయం దొల్లిటియట్లుకా నిలుప నుద్యోగించి క్రోడంబవై
పొరి నబ్భూతలమెత్తినట్టి ఘనదర్పున్ నిన్ను భావింతు ని
ర్భరకారుణ్య నిరూఢచిత్త రఘువీరా! జానకీనాయకా! ౧౦౨

మ. వడుగా! నీవడుగంగ నేర విట నల్పంబైనదానంబు న
న్నడుగన్ వచ్చితి వన్నఁ గన్గొని బలీంద్రా నాకు నీవిచ్చుమూఁ
డడుగు ల్మూఁడు జగంబులంచుఁ గొనవా యాద్యంతముల్ మాటమా
ర్పడ నాడన్ నుడికాఁడవౌర రఘువీరా! జానకీనాయకా! ౧౦౩

---

[1] పాఠాంతరము —

మ. దనుజాధీశులు నిర్జరాధిపతులున్ దామందఱున్ మందరున్
ఘనసత్త్వంబున నెత్తి వార్ధినహిపుం గవ్వంబుగాఁ ద్రచ్చుచో
మునుఁగం బాఱకయుండఁ గచ్ఛపమవై మున్నీటిలోనుండువ
ర్తన మే నాత్మఁదలంచుచుందు రఘువీరా! జానకీనాయకా.

శా. ఏతల్ గాక మురాంతకుండు గలఁడా యెందైన నిందైన నీ
నీతు ల్మాను మటంచుఁ దండ్రి సుతునిన్ నిష్ఠూరతిలోఁ జూపరా
చూతున్ నాఁగ నృసింహరూపమున నచ్చో నుండవా చెండవా
రాతింబోలినదైత్యుమేను రఘువీరా! జానకీనాయకా! ౧౦౪

మ. సమరక్షోణులఁ బాఱఁబాఱఁగ జరాసంధాదులం ద్రుంచి చం
డమదాభీలుని ధేనుకాసురుని చట్ట ల్చీరి ముష్టిప్రహా
రములన్ ముష్టికు నాప్రలంబదనుజున్ ఖండించి తా రేవతీ
రమణాకారముఁ దాల్చియౌర రఘువీరా! జానకీనాయకా! ౧౦౫

మ. నిను నారాయణమూర్తిగాఁ దలఁచుచున్ నీదండ నాదండకా
వనవాచంయము లెల్లఁ జేరి కొలువన్ వారిం గృపం జూచుటల్
వనధిం గట్టుట రావణుం దునుముటల్ వర్ణింతు రామావతా
రనిరూఢాకృతి నిన్ను నౌర రఘువీరా! జానకీనాయకా! ౧౦౬

మ. అమరారాతివధూటికారమణుల న్నశ్వత్థనారాయణ
ద్రుమముం గౌఁగిటఁ జేర్పఁ జేసి వ్రతము ల్మాలించి బుద్ధావతా
రమునన్ రుద్రసహాయమై త్రిపురముల్ భగ్గించి తౌరౌర ధీ
ర మునిస్తుత్య యశోవిహార రఘువీరా! జానకీనాయకా! ౧౦౭

మ. కలికాలాంతమునన్ గిరాతజనముల్ గర్వించినం దత్కిరా
తుల నెల్లన్ విదళించుచున్ గృతయుగద్యోతంబుఁ గావింప నిం
పలరం గల్కివిగాఁగ నున్నహరి ని న్నశ్రాంతముం గొల్చువా
రలు పుణ్యాత్ము లగణ్యశూర రఘువీరా! జానకీనాయకా. ౧౦౮

శ్రీనాయకవి యయ్యలరాజు తిప్పరాజప్రణీతంబైన
యొంటిమిట్ట రఘువీరశతకము సంపూర్ణము.

---

శ్రీమదొంటిమిట్ట కోదండరామార్పణమస్తు.

# ఆర్యవిద్యోపన్యాసము.



ఇది నూతన జాతీయపాఠశాల స్థాపించుసమయంబున వావిలికొలను సుబ్బారావుగారిచే నుపన్యసింపఁబడెను. ప్రభుత్వమువారే యుద్దేశముతో మనకు నాంగ్లభాష నేర్పఁబూనినదియు, జాతీయవిద్య యెట్టిది విజాతీయవిద్య యెట్టిదైనదియు, క్రైస్తవమతబోధకుల దుండగములు, పూర్వము మనవారు నేర్పు విద్య యెట్టిదైనదియు, నెట్లు నేర్పఁబడుచుండినదియు, జాతీయవిద్యవలని లాభములు, విజాతీయవిద్యవలని కీళ్లులోనుగా ననేకవిషయము లిందుఁ జర్చింపఁబడినవి. జాతీయ విద్యాభిమానులందఱుఁ జదువఁదగినది.

వెల, అణాలు ౮.

పోస్టేజి ౦-౧-౦ మాత్రము పంపినయెడల నిజమైన గ్రంథాలయముల కుచితముగాఁ బంపఁబడును.

ritish Model Press, Choolai, Madras—1921.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| 10. బమ్మెర పోతన గీతములు, రామనుతి, కృష్ణనుతి | 0 | 1 | 0 |
| 11. బమ్మెర పోతన రత్నములు, (కాలికోబయిండు) . | 0 | 14 | 0 |
| ,, (రంగుకాగితము) . | 0 | 10 | 0 |
| (భాగవతములోని మంచి పద్యములన్నియు నేతి భక్తి నీతి స్తుతి వైరాగ్యాదులు తరగతులుగా విభజించి కూర్పఁబడినవి. 500 కెక్కువపద్యములు గలవు. ప్రత్యాంధ్రుఁడును సదయమునఁ బఠింపఁదగినది.) | | | |
| 12. శ్రీకాళహస్తిమాహాత్మ్యము, (ధూర్జటికవి ప్రణీతము) | | | |
| ,, రెండవకూర్పు (నిండుకాలికో) . | 1 | 4 | 0 |
| ,, (సగముకాలికో) . | 1 | 0 | 0 |
| 13. భీమఖండము (శ్రీనాథప్రణీతము) (నిండుకాలికో) . | 1 | 4 | 0 |
| ,, ,, (సగముకాలికో) . | 1 | 0 | 0 |
| 14. †సులభవ్యాకరణము 4-వ కూర్పు 1-వ భాగము . | 0 | 11 | 0 |
| † ,, 2-వ ,, . | 0 | 12 | 0 |
| † ,, 3-వ ,, . | 0 | 9 | 0 |
| 15. †ఆర్యకథానిధి 1-వ భాగము* (నిండుకాలికో) . | 0 | 4 | 0 |
| † ,, 2-వ ,, * ,, . | 0 | 4 | 0 |
| † ,, 3-వ ,, * ,, . | 0 | 4 | 0 |
| † ,, 4-వ ,, * ,, . | 0 | 4 | 0 |
| † ,, 5-వ ,, * ,, . | 0 | 5 | 0 |
| † ,, 6-వ ,, * ,, . | 0 | 5 | 0 |
| 16. ఆర్యచరిత్రరత్నావళీమాలికాగ్రంథములు | | | |
| †హరిశ్చంద్ర చరిత్రము* (నిండుకాలికో) . | 0 | 5 | 0 |
| †శకుంతల ,, * ,, . . | 0 | 5 | 0 |
| †నల ,, * ,, . . | 0 | 6 | 0 |
| †సావిత్రి చరిత్రము* (నిండుకాలికో) . | 0 | 5 | 0 |
| భగవద్గీత ,, * ,, . . | 0 | 8 | 0 |
| భగవద్గీత మంచిపట్టుఅట్ట బంగారుగిల్టు నీరు అంచు . | 0 | 12 | 0 |

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| †హనుమంతునిచరిత్రము, 1-వ భాగము* (నిండుకాలికో) | 0 | 7 | 0 |
| ,, 2-వ ,, | 0 | 7 | 0 |
| †సీత 1-వ భాగము* (నిండుకాలికో) | 0 | 7 | 0 |
| ,, 2-వ ,, * ,, | 0 | 7 | 0 |
| ,, 3-వ ,, * ,, | 0 | 7 | 0 |
| రుక్మాంగదచరిత్రము* ,, | 0 | 7 | 0 |
| 17. హితచర్యామాలికాగ్రంథములు. | | | |
| బాలకహితచర్య (314 పుటలు) (నిండుకాలికో) | 0 | 9 | 0 |
| కుమార హితచర్య ,, | 0 | 9 | 0 |
| పతి హితచర్య | 0 | 11 | 0 |
| †కుమారీ హితచర్య* ,, | 0 | 5 | 0 |
| సతీ హితచర్య ,, | 0 | 8 | 0 |
| గర్భిణీ హితచర్య* ,, | 0 | 10 | 0 |
| 18. కుమార దండకము | 0 | 1 | 0 |
| 19. ఆధునికవచనరచనవిమర్శనము, గ్రామ్యవాదఖండనము | 0 | 2 | 0 |
| 20. ఒంటిమిట్ట రఘువీరశతకము | 0 | 4 | 0 |
| 21. ఆర్యవిద్యోపన్యాసము, (జాతీయ విద్యాభ్యాసము గురించి) | 0 | 8 | 0 |
| 22. శ్రీరామనామమాహాత్మ్యము | 0 | 4 | 0 |

15, 16, 17 పట్టుకాలికోలో నైన 0-1-6 ఎక్కువ. రకమునకు 10-0-0 లకుఁ దక్కువలేక దీనికొనువారికి 100-కి 20 వంతున కమిషన్ ఇయ్యఁబడును.

ఈ గ్రంథములు వలయువారు:—

1. శ్రీ రామవిజయమందిరము, తిరువల్లిక్కేణి, మదరాసు.
2. కం. వేంకటశేషగిరిరావు అండు సన్సు, సంతపేట, నెల్లూరు.

వీరిలో నెవరికైన వ్రాసి తెప్పించుకొనవచ్చును.